# ఔరంగాబాదులో ఆకాశవాణి

## ప్రధానమంత్రిగారిచే ప్రారంభోత్సవము

౩ ఏప్రిల్ నాడు ప్రధానమంత్రిగారైన రై. అ. సర్ అక్బర్ హైదరీగారు ఔరంగాబాదుకు వెళ్ళిరి. స్థానికముఖ్యులకు దర్శనమిచ్చిరి. తర్వాత కొన్ని గోరీలను దర్శించిరి. శ్రీవారికి ఒక విందు కావింపబడెను. ఆసమయములో శ్రీవారు రాష్ట్రానికి చేసిన అపారసేవ ఉస్మానియావిద్యాపీఠస్థాపన వానివృద్ధి రైల్వేసుకొనుట, బటేటువృద్ధి, ఇతన్నియు శ్రీవారికీర్తిని ప్రపంచమంతటను విఖ్యాతపరిచెనని ఉపన్యాసములు జరిగెను. పిటీక్లబ్బు ఎట్లువృద్ధికివచ్చెనో స్థానికాధికారులశ్రద్ధ యెట్లు ఉపకరించెనో అవిషయాన్ని గురించి శ్రీవారికి తెలిపిరి. దానికి శ్రీవారు జవాబు చెప్పుచు నిట్లనిరి. "నేను రాష్ట్రములో ఎచ్చటికిపోయినను ప్రభుత్వాధికారులును ప్రజలును పరస్పరసానుభూతిగలవారై యుండవలెనని బోధించుచున్నాను. వానికిట్టిక్లబ్బులు పనికివచ్చును. ఔరంగాబాదు నగరాన్ని ఇంకను అందమైనదానిగా చేయుటకు ప్రభుత్వమువారు ప్రయత్నించుచున్నారు" క్లబ్బుకుగాను ౫౦౦౦రూ॥ ఇప్పించుతునని శ్రీవారు చెప్పిరి. తర్వాత అందరును మ. ఘ. వ. నిజాంప్రభువుగారికి దీర్ఘాయువు ఆరోగ్యంకొరకై ప్రార్థించవలెనని కోరిరి.

౪ ఏప్రిల్ నాడు శ్రీవారికి మునిసిపాలిటీ పక్షాన యుద్ధసహాయకసంఘపక్షాన సన్మానపత్రము సమర్పింపబడెను. శ్రీవారు కృపాపరిశ్రమలు పునరుద్ధరించినందులకును అజంటా ఎల్లోరాగుహాలకు కాపాడినందులకును సన్మానపత్రములో శ్రీవారిని ప్రశంసించిరి.

దానికిజవాబిచ్చుచు శ్రీవారు యుద్ధసహాయసంఘమువారు చేసినకృషిని ప్రశంసించిరి అన్నిజిల్లాలకన్న ఔరంగాబాదులోనే యెక్కువద్రవ్యము వసూలైనది. హైదరాబాదుసహాయము చాలాగొప్పది. హైదరాబాదు స్వాతంత్ర్యదినంవరకు ౧౦౦౦౦౦ మించిన శత్రువిమానాలకూల్చినది. ఔరంగాబాదువారి ద్రవ్యములకు నిర్మించినవిమానాలున్న శత్రువుల విమానాలను అతివిధముగా నాశనముచేయవలెను. అనేకశతాబ్దాలనుండి ఔరంగాబాదు దక్షిణసంస్కృతికి కేంద్రముగానుండినది. ఇచ్చట అనేకశతాబ్దాలుగా హిందూముసల్మానులు శాంతజీవనంగడిపినారు. మల్కపరిశ్రమలు ఇచ్చట చాలావృద్ధిపొందినవి, ఒకప్రక్క ఎల్లోరా అజంటా ఇంకొకప్రక్క రబ్బియాదుర్రానీ గోరీయుంకలవు.

ఔరంగాబాదు ప్రజల అభివృద్ధికై ప్రభుత్వమువారుచేయుచున్న కృషిని శ్రీవారు తర్వాత నివేదించిరి, మంచిరోడ్లువేసినారు. అన్నినగరాలలోను దుమ్ములేకపట్టి మంచిరోడ్లు వేయించనున్నాము.అని శ్రీవారు తెలిపిరి.

ఇదేదినము ౪ ఏప్రిల్ నాడు శ్రీవారు ఔరంగాబాదులో బ్రాడ్కాస్టింగు (ఆకాశవాణి) స్టేషన్ యొక్క ప్రారంభోత్సవమును గావించిరి. అస్థలము బాగాఅలంకరింపబడియుండెను. స్థానికాధికారులందరును వచ్చియుండిరి. సుమారు ౩౦౦మందిని అహ్వానించియుండిరి. అ.ప్రముఖులు వచ్చియుండిరి. సాయంకాలం ౪-౩౦ గంటలకు అతిథులందరును విచ్చేసిరి. నవాబు అలియావర్ జంగుబహద్దూర్ గారు వారికిస్వాగతమిచ్చిరి ౫గంటలకు సరిగా సర్. అక్బర్ గారు ఆకాశవాణిస్టేషను ప్రారంభోత్సవంజరిపిరి. ఆ సమయంలో ఉర్దూలో శ్రీవారికి సన్మానపత్రమునుఅర్పించిరి. శ్రీవారు ఉర్దూలో దానికి జవాబిచ్చిరి. తర్వాత విందుజరిగెను. సాయంత్రం ౭ గంటలకుసభముగిసెను. ఆనాటిఆకాశవాణిలో సంగీతము, జానపదములు ఆనాటివార్తలు వినిపింపబడెను.

### ప్రధానమంత్రిగారు జాల్నాలో

శ్రీప్రధానమంత్రిగారు ఔరంగాబాదు పోవుచు వారిలో జాల్నాలో దిగిరి. సూబాజిల్లా అధికారులు శ్రీవారికిస్వాగతమిచ్చిరి అచ్చట శ్రీవారు హాజరత్ జమాలుల్లాగారి గోరీని దర్శించుకొనిరి. తర్వాత అగ్సుటికోటలోని తోటనుచూచిరి. గ్రాగునీటి సప్లయిపనులను తనిఖీచేసిరి. తర్వాత గంజానిచూచిరి. మొత్తం హిందూస్థానంలో జాల్నాగంజావంటిగంజా లేదనిప్రతీతి దానినిర్మాణముజరుగుచున్నది. అది పూర్తిఅగుపరకు ౧౨లక్షలుఖర్చగును. అచ్చటిజనులు శ్రీవారికి ఘనమైనస్వాగతమిచ్చిరి. "మహారాజాస్మాక్ జిందాబాదు, సర్ అక్బర్ జిందాబాదు" అని కేకలువేసిరి. శ్రీవారికి నగరసంఘమువారును మార్కెటుకమిటీవారును సన్మానపత్రమర్పించిరి.

## తక్కువకిరాయికి యిండ్లు

ట్రూపుబజారులో సెంట్రల్ బ్యాంకు యెదురుగా దివాన్ బహదుర్ అరావముదయ్యంగారు, అడ్వకేటుగారిఅమృతనగరులో తక్కువకిరాయిలో (రూ. ౨౭ మొదలు 30వరకు) యిండ్లుకిరాయికి దొరుకగలవు.వివరములకుదివాన్ బహదుర్ అరావముదయ్యంగారి ఆఫీసులో తెలియ గలవు.

# ఇరాకులో మంత్రివర్గ విప్లవం

ఇరాకులో రాజాగారును,రీజెంటుగారును ముఖ్యపట్టణములో లేనిసమయము లో సనసభ సమావేశము అపియుంచబడిన సమయము; చూచుకొని, రాజాగారుగాని రీజెంటుగారు గాని క్రొత్తమంత్రివర్గము నేర్పరచుటకై ఎవరిని గాని కోరకున్నను,'రషీదలీ గారు క్రొత్తమంత్రివర్గము నేర్పరచినారు ప్రధానిగానుండిన తహాపుల్ హాషిమిగారి రాజీనామాను రీజెంటుగారింకనుఅంగీకరించలేదు. ఈక్రొత్తమంత్రివర్గమునకు ఇరాకులోనిరాష్ట్రములంగీకరించునో అంగీకరించవో తెలియదు, కాని పూర్వమంత్రివర్గము బ్రిటనుతో సఖ్యముగా నుండెదమని చెప్పియుండెను. ఇప్పుడేర్పడినమంత్రివర్గమేమిచేయునో, దానియెడ బ్రిటిషువైఖరి ఎట్లుండవలెనో బ్రిటను ఆలోచించుకొనుచున్నది.

—

## మధిర

—

### మరల యింకొకదొంగతనము

—

మధిర రైల్వేస్టేషనులోదొంగతనాలు హెచ్చు పెరిగిపోవుచున్నవి. నాలుగుదినములక్రిందటయిద్దరు రైతురెడ్డిసోదరులు టిక్కెట్లుతీసుకొని బెజవాడపోవుటకు రైలెక్కబోగా జేబులోనున్న నూటఆరువది రూపాయలుగల పాకెట్టుఒకటిన్ని రెండవవారిది పదిరూపాయలు మొత్తం అపహరింపబడెను. పోలీసువారు రెండవస్టేషనుకు టెలిఫోనుచేసిరి. కానిదొంగదొరకలేదు. అరైతుల గోడు చూచిన అందరికినిజాలికలుగకమానదు. ఈజేబు దొంగలు-బెజవాడనుండి దిగుమతిఅగుచున్నటుతెలియుచున్నది. పోలీసు వారు తగుకట్టుదిట్టములు చేయునిచో యింకాయెన్నిమంది యీ నష్టములకు పాల్పడుదురో?

పట్టికొండ రామకోటయ్య,

(అల్లీనగరం)

## ఖమ్మంమెట్టు

అనవసరటోలుగేట్లు బాధతప్పింది

(విలేఖరి)

ఇటీవల నాలుగు నెలలనుండి ఖమ్మంమెట్టు టోలుగేట్లకంట్రాక్టరుగారు లైసెన్సుగల బండ్లకు కూడా బైటనుండిప్పైనాసరకులు తేకపాలము నుండి గింజలుగడ్డివగైరా తోలుకొచ్చుకొన్ననూ అనవసరముగా టోలుగేటువసూలుచేయుచున్నారు. ఈవిషయమై ప్రభుత్వమువారితో ప్రజలు మొరపెట్టుకొనియున్నారు. పత్రికద్వారా తెల్లడించియున్నారు. అది ప్రభుత్వమువారు గమనించి మొన్న ౧౫ మార్చినుండి గేట్లను తమ స్వాధీనముచేసుకొనినారు. లైసెన్సుగలబండ్లకు గేటుచీటీచేయుట తీసివేసినారు, ముందు ఏకంట్రాక్టరుకు యీగేట్లుపాటలో యిచ్చిననూ. యీనియమవారిలైసెన్సుపొందినబండ్లకు చీటీ వేయకూడదని షరతుతో యిచ్చెదరని తెలియుచున్నది. ఈవిషయమున అనవసరపుకర్చుకు లోనైనవారందరును సంతోషించుచున్నారు. ప్రభుత్వమువారికి కృతజ్ఞత చెల్లించుచున్నారు.

### కలరావ్యాధి

ఖమ్మంమెట్టులో దాదాపు యిరవైదినముల నుండి కలరావ్యాపించుచున్నది. మొన్న టేదినములలో చాలాగడబిడగానుండెను. ప్రభుత్వమువారు చాలాసహాయము చేయుచున్నారు. ఏటి నీరు తెచ్చుకోనకుండా కాపలాగాయుచున్నారు, టీకాలువిరివిగాతీయుచున్నారు. పొటాషియంపరమాంగనేటు, ఫీనైలు డాంబరు, యింజక్షనులు వగైరాలకు యింతవరకు నూరు రూపాయిలకుపైగా కర్చుపెట్టినారు. దానిఫలితముగా కలరాతగిలినవారునూ చాలామందిజీవించియున్నారు_మార్చి౨౫వతేదీవరకు కలరాతగిలినవారిసంఖ్య ౧౬. అందులో మరణించినవారు ౬గురు మాత్రమేనని తెలియవచ్చినది ఈవిషయములో అమితశ్రద్ధగైకొనుచున్న ఆరోగ్యశాఖవారికి పౌరులు కృతజ్ఞులు.

చనిపోయినవారిలో ఎక్కువనుంది అశుభ్రతగానుండు మాలమాదిగలని తెలియవచ్చినది,

### జాతీయవారము

ప్రతిసంవత్సరమువలెనే యీ సంవత్సరమును హరిజనసేవకులు హరిజనవాడలయందు జాతీయవారసందర్భమున మార్చి౬వతేదీనుండి ౧౩వ తేదీ వరకు. ప్రభాతఫేరీలు, వీధులు. గృహములుశుభ్రపరచుట, ఖద్దరువిక్రయము మొదలగు నియమిత కృత్యములను శ్రద్ధతో చేయదలంచియున్నారు. హరిజనసేవాభిలాషులు సాయపడ ప్రార్థన.

ఇట్లు
హరిజన సేవకుడు

## మహబూబునగరం

ఆర్యసమాజపతాకం చించివేయుట

(స్వ.వి.) మహబూబునగరం ౨-౪-౧౫

అయిదురోజులక్రిందట ఎవరోదుండగీండ్రు ఆర్యసమాజఓంపతాకమును చించిముక్కలు ముక్కలుగాచేసి మందిరమున్నసమీపములోనే వీధిలో పడవేసినారు. సమాజీకులు ఈసంగతితెలిసి క్రొత్తగా| పతాకం తయారుచేయించి పెట్టుచున్నారు.

### లాలాశేటు మరణము

మొన్న ఆదివారం పగటికి లాలామిఠాయిశేటు మరణమొందెను. ఇతనిమిఠాయి జిల్లామొత్తములో ప్రశిద్ధి. ఇతనిభార్యపిచ్చిది. ఇతనితోకనీసం (౫౦) తులములబంగారము తదితరకట్టుసామానులుండెను. పోలీసువారు పంచనామచేసి పూర్తి తమదగ్గరవుంచిరి. ఆపిచ్చిభార్యను అచ్చటనేవదలినారు, ఇతడు స్థితిగలవాడైనను మార్వాడీలు చందాచేసి దహనక్రియలుసల్పిరి. ఇతనితమ్ముడు కూడ ఎచ్చటనోవున్నాడని తెలిసినది. ఆతనికి మార్వాడీలు జాబువ్రాసినట్లు తెలిసినది. ఆతడు రానియెడల పైపంతయుసర్కారిలోచేరును.

## వర్తకుల వింతచర్య

భువనగిరి, చ ౨౯-౬-౧౩౫౦

ఇక్కడ పూర్వమునుండి ఆమిదాలతూకము బస్తకు ౧కి ౧౩-౧ పోన్లువుండెను సుమారు పదిమాసములనుండి ౧౬-౫ పోన్ల చొ॥ చేసినారు- కొందరురైతులు యిదేమిటయ్యా తూకముయెక్కువ చేసినారుఅని వర్తకులనుఅడుగగా మేము తెలిసినిఆనూధుకరైతులకు దేమిమోనచ్చెప్పిరి యిట్లుమూడు నాల్గుమాసములుగడచినపిదప సర్కారితరఫున మార్కెటుఅని ఒకకమేటిని స్థాపించిరి యిగనైనమాబీదరైతులకు యేనష్టములేకుండు నేమోయనితలనుకుంటిమి కాని యీకమేటిస్థాపించకమునుపు బండిఒక్కంటికి ఒకఅణా చొ॥ దొడ్డిపయిసలువసూలుచేస్తువుండిరి యిప్పుడు ౨ అణాలవంతున వసూలుచేస్తువున్నారు మరి ౨౦ అర్దిచేహస్తు నుండి ౧౬-౫ పోన్లతూకమునకు ౧౬-౬ పోన్లతూకము చేసినారు ఒకపైవు పంటలుసరిగా పండక తినుటకులేండలేక మలమలమాడుచుండ యీవర్తకులు యిట్లువోచుకుంటుండగా మేము జీవించుటెట్లు.

ఇట్లు,
ఒక రైతు

## ధ్వజస్తంభ ప్రతిష్ఠకై అడ్డంకి

విశేఖరి)

వనికిరాలజాగీర్ [యిలాఖా] రాజాధరంకరన్ బహద్దర్),

చ-౨౬-అర్దిబెహస్తు ౧౩౫౦ఫ-

యీగ్రామములో శ్రీలక్ష్మీనారాయణస్వామి వారిదేవాలయమందు ధ్వజస్తంభము కట్టెదికావటంవల్ల గాలివానచేక్రిందబడి దాదాపు యెనిమిదిమాసములుకావచ్చెను: కాని దాని ప్రతిష్టకొరకై గ్రామప్రజలు తహసీల్ లో మహాజర్లు పెట్టుకొనిరి-తహసీల్దారుగారు గ్రామప్రజల మహాజర్లను యేమూలనోపడవేసిరి_ ప్రతిసంవత్సరముజరిగే వియామకవుత్సవమునకు ఆటంకములుజరిగెనా_ యెందుకనగా ధ్వజస్తంభము ప్రతిష్టకానిది-వుత్సవములుజరుగకూడదు. గ్రామ ప్రభువులు సహితము యీకార్యముకొరకై చాలావరకు తహసీల్ లో రిపోరటుచేసిరి_యిన్ని తీర్ల ప్రయత్నంచేసినప్పటికి తహసీల్దారుగారు మంజూరి చేయకపోవటం చాలా వింతగానున్నది.

## వరంగల్లు

శ్రీ వాసవీ పఠనమందిరము

శ్రీవృషనామసం॥ చైత్రశు ౧లు అమ్మవారం రోజున మహారాజశ్రీ తోటచెంద్రశేకరంగారి చరణములో (ఆర్యవైశ్య సేవాసంఘమువారి)యాజమాన్యమున [శ్రీవాసవీపఠణామందిరము]స్థాపించి యీదిగువ రెమెన్నికలు జరిపిరి.

౧ అధ్యక్షుడు శ్రీయుత శ్రీరామచంద్ర మూర్తిగారు.

కార్యదర్శి- దుగ్గిశెట్టి వెంకటయ్యగుప్తగారు.

మిరియు కార్యనిర్వాహకవర్గమువారిని కూడ యెన్నుకొనిరి.

ఇట్లు
దుగ్గిశెట్టి వెంకటయ్యగుప్త,
కార్యదర్శి.

## అమ్మాపల్లి జాతర

షంషాబాదుకు సమీపంలోఉండే అమ్మాపల్లిగ్రామములో శ్రీరామచంద్రదేవాలయములో గతసంవత్సరములవలె చైత్ర శు ౯మికి సరియగు చ_౨ ఖుర్దాదు ఆదివారంనాడు శ్రీరామనవమి (అగ్నం) మరియు శు-౧౨ సరియగు ౫ ఖుర్దాదు బుధవారంరాత్రికి రథోత్సవముజరుగును షంషాబాదునుంచి దేవాలయమువరకు తోవబాగుచేయించబడినది యాత్రీకులకు దుకాణములుపెట్టువారికి సౌకర్యములుచేయుబడినవి.

# గోలకొండపత్రిక

వృషనామసం॥ర చైత్ర శు॥ ౧౩

గురువారము


## దీనబంధు స్మారకము.

సీ. యఫ్. ఆండ్రూసుగారు చనిపోయి ఒక సంవత్సర మయ్యెను. అతడు పుట్టినది ఇంగ్లాండు దేశము. అతనిజాతి ఇంగ్లీషుజాతి. మతము క్రైస్తవమతము కాని అతని జీవితములో విశేషభాగము హిందూస్థానములో గడిచెను. తుదకు చనిపోవుటకూడ హిందూస్థానములోనే జరిగెను. అతడుచేసినది భారతీయులసేవ. హిందూస్థానములోని భారతీయులకే కాక ఆఫ్రికాలో భారతీయులకును అతడు సేవజేసెను.

"కర్మణ్యేవాధి కారస్తేమాఫలేషుకదాచన" అనుగీతోక్తి ప్రకారము అతడు తన జీవితమును గడిపెను. ఏసు క్రీస్తు బోధను అక్షరాల పాలించినట్టి ఉత్తమ సాత్వికజీవితుడు. గీతలో శ్రీకృష్ణపరమాత్మ ఇట్లుబోధించెను. "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకంశరణం వ్రజ" ఈ సిద్ధాంతమునే క్రీస్తుభగవాను డిట్లుబోధించెను, "Leave all thou hast and follow me." నీకున్న సమస్త ప్రాపంచికమును వదలి నన్ను అనుసరింపుము అని క్రీస్తుభగవానుడు బోధించెను. ఈతత్వమును బాగుగా ఆండ్రూసు పాలించెను. ఆర్తధ్వని యెక్కడవినబడుచుండెనో అక్కడికి వారువెళ్లి తనశక్తి వంతయు వినియోగించి సంఘసేవ జేసెను

మన దేశానికి అనేకశతాబ్దల నుండి యూరోపు ఖండమునుండి అనేక క్రైస్తవ పాదిరీలు వచ్చి హిందూముస్లిములను క్రైస్తవమతములో చేర్చుటకై ప్రయత్నములు చేయుచువచ్చిరి. ఈ క్రైస్తవ మిషనరీలు ద్రవ్యమును విరివిగా వ్యయముచేసిరి. బైబిలుగ్రంథాలను ఉచితముగా పంచిపెట్టిరి. ఉచితవిద్య చెప్పించిరి. ఉచితవైద్యముచేసి రోగులకు చికిత్సలుచేసిరి. అయితే యీసేవలన్నింటికిని వారు ప్రతిఫలముకోరిరి. ఇతర మతస్థులు తమ తమ మతాలను వదలుకొని క్రైస్తవమతము అవలంబించవలెనని వారుకోరిరి. ఈ ప్రయత్నాలు ఇప్పటికిని దేశమంతటను జరుగుచున్నవి. కాని భగవద్గీతోప దేశప్రకారము "సర్వకర్మఫలత్యాగం సన్న్యాసంకవయోవిదుః" అన్నట్లుగా నిష్కామకర్మియే నిజమైన మిషనరీగా పరిగణింపబడును. ఒక ఉద్దేశ్యమును ప్రకటించుచు అభిలషించుచు అందుకై చేసిన సేవ నిష్కామకర్మ కానేరదు. అందుచేత పాప మామిషనరీలు ఎంత ప్రయాసపడినను వారిని భారతీయులు ప్రేమించుటలేదు. సీ. యఫ్. ఆండ్రూసుగారుకూడ మొదట మొదట భారతదేశానికి ఒక మిషనరీగా వేతెంచి సర్వం క్రైస్తవ మయముగాచేయవలెనని గాఢముగా అభిలషించి యుండిరి. కాని భారతదేశములో గాంధీ, టాగూరు, మున్నగు మహాపురుషుల సత్సాంగత్య ఫలితముగా ఈ దేశములో బోధించుటకు మారుగా నేర్చుకొనవలసినదే యెక్కువగానున్నదని వారు గ్రహించిరి. అటుపై వారు తమ భావములను మార్చుకొని కేవలము నిష్కామసేవయే తమజీవితాదర్శముగా ఉంచుకొని తుదివరకును సేవచేయుచు వచ్చిరి.

ఆండ్రూసుగారికి బ్రిటిషు ప్రభుత్వమువారు సర్ బిరుదముగాని డాక్టరు బిరుదముకాని, రైట్ ఆనరబిల్ బిరుదముకాని మరియే బిరుదులుకాని ప్రసాదించి యుండలేదు. కాని బీద భారతీయులు ఏకవాక్యంగా ఆండ్రూసుగారికి "దీనబంధు" అను బిరుదమును ప్రసాదించిరి. ఈ బిరుదానికే అత్యధిక విలువకలిగెను. అధికారశక్తిచే ఇచ్చినబిరుదములు ప్రజా సముదాయములో ప్రేమను ఉత్పత్తి కల్గింపనేరవు. అనురాగ రక్తిచే ప్రజలిచ్చిన బిరుదమునకుండు విలువ అద్వితీయము. అందు అష్టవసువుల శక్తులన్నియు ఇమిడియుండును.

దీనబంధువును భారతీయులెన్నటికి మరువజాలరు, కృతఘ్నత భారతజాతికి మాత్రములేదని దాని చరిత్రబోధించుచున్నది. దీనబంధుస్మారకముగా ౫ లక్షల రూపాయలు ప్రోగుచేయవలెనని మహాత్మాగాంధీ గారిటీవలనే కోరియుండిరి. భారతీయులందరును శక్తికొలది యీ మొత్తమును సమకూర్చుకొనుటకై తోడ్పడుదురుగాక. దీనబంధువును ప్రతిభారతీయుడగు ఆదర్శముగానుంచుకొని దేశసేవ చేయుగాక.

---

## తుర్కీ—అమెరికా సహాయము కోరుట

తుర్కీ—దేశానికి అమెరికావారు బ్రిటనుకు ఇచ్చుచున్నట్లే యుద్ధసామగ్రిని పంపవలసినదని కోరుటకై అమెరికాసంయుక్తరాష్ట్ర ప్రధానగరమగు వాషింగ్టనులో తుర్కీ—రాయబారిగానున్న అధికారి ఏప్రిలు ౮వ తేదిన అమెరికా అధికారులతో సంభాషణలు ప్రారంభించెను—అమెరికావారు లోకసభ ఒప్పుకొన్నతర్వాత జరిగెపనియేమనగా బ్రిటిషువారు మధ్యసరాసముద్ర ప్రాంతంలో ఉంచే తమయుద్ధసామగ్రిని తుర్కీ—కిచ్చినచో బ్రిటనుకు అమెరికావారు ఆ కొలవబడిన సామగ్రిని పంపించగలరు.

---

## పంజాబుప్రధానికుమారుడు తిరిగి లభించుట

ఇదివరలో ఆఫ్రికాలో యుద్ధంలో బ్రిటిషు పక్షమున పోరాడినట్టి పంజాబు ప్రధాని సర్ సికిందర్ హయాత్ ఖాన్ గారి పెద్దకుమారుడు లెఫ్టినెంట్ షౌకతుహయాతుఖాన్ గారు పోయినవారములో ఇటాలీయులచే ఖైదుచేయబడినట్లు వినియుంటిమిగదా' అతడు ఏప్రిలు ౬వ తేదివాడు ఇటాలీయులనుండి సిరియా రాజ్యమునుండి విడుదలచేయబడినాడు. అతని ఆరోగ్యస్థితి ఇపుడు కొంచెము గుణపడియున్నది, త్వరలోనే అతడు తన సైనికదళములో చేరసిద్ధపడుచున్నాడనియు తెలియుచున్నది.

---

## వేలూరులో డిఫెన్సు రాజకీయ ఖైదీలస్థితి

హైదరాబాదు గ్రంథమాలలవారికి అభినందనములు

శ్రీచావిలాల గోపాలకృష్ణయ్యగారి లేఖ

మద్రాసురాష్ట్రములో వేలూరుసెంట్రల్ జెయిలులో డిఫెన్సు రాజకీయ ఖైదీగనున్న శ్రీ చావిలాల గోపాలకృష్ణయ్యగారు వ్రాసినఒకలేఖలో క్రిందివిధముగ తెల్పినారు:—

మహాశయా,

నమస్కారములు. తమకుబహుశః ఎరిగియున్నను మరచియుందురు ………… …… ………… …… …………

తరువాత నేను రాజకీయసంగ్రహములు ఎక్కువయుండుటచే తమపత్రికకువార్తలు, వ్యాసములుపంపుట తగ్గించుకొనవలసివచ్చెను:

నన్ను 'ఆంధ్రరాష్ట్రము' 'సంస్థానాలు' గ్రంథకర్తగా యెరిగియుందురని తలంతును. తమపత్రిక ఈనడుమపొందిన అభివృద్ధిని సంవత్సరంన్నరక్రింద చూచియుంటిని. కాని అతర్వాత చూచియుండజాలకపోయితిని, కారణమునన్ను ౧౯౪౦—౧౧—౧౫ న డిఫెన్సుఆఫ్ ఇండియాఆక్టుక్రింద ౨౬వ సెక్షనుప్రకారము అరెస్టుచేసి ఉపన్యాసానికి నాపేరుపెట్టి సంవత్సరం కఠినశిక్ష వేసిరి ౧౯౪౧—౨—౧౫తో శిక్షానంతరం విడుదలచేసి మరల ౧౯౪౧—౨—౧౫న సదరు డిఫెన్సుఆఫ్ ఇండియాచట్టంక్రింద ౨౬సెక్షనుప్రకారం నిరుకుత్తరువులనిచ్చి "నిర్నిరోధాక్షేత్రం" ద వెల్లూరు సెంట్రల్ జెయిలులో నిల్పవుంచిరి. ఈ నడుమప్రపంచంలోజరిగిన పరిస్థితులుయేమీ తెలియవు. భాషావిషయంగా ప్రపంచంలో ఆంధ్ర ప్రపంచంలోజరిగినమార్పులు తెలియవు. మీసంస్థానసీమలోజరిగిన ఆంధ్రోద్యమాభివృద్ధి గాని తెలియదు, హైదరాబాదుమినహాగా ఆంధ్రదేశములోని ఆంధ్రఅభివృద్ధి ఆర్థాంధ్రాభివృద్ధియనవలసివుండును. కావునఆంధ్రఅభివృద్ధిని పూర్తిగ తెలియవలెనన్న కొంతగాఈనడుమ 'ఆంధ్రప్రభ' వారు ప్రచురించుచున్న హైదరాబాదు విశేషాలు వార్తలవల్ల కొంత తెలియగలవు గానిఅదియును సమగ్రముగా వుండడంలేదు అందుకైమీ 'గోలకొండపత్రిక'ను చదువకతప్పదు కావునదయచేసి ఈ హైదరాబాదు ప్రవాసంలోవున్న మాకుపయోగార్థమై తమపత్రికను పంపగోరుచున్నాను.

### హైదరాబాదులోని క్రొత్త గ్రంథమాలల కభివాదాలు

హైదరాబాదులో ఆంధ్రాభివృద్ధికి మూలహేతువు మీపత్రిక, మీవ్రాతలు వాటితోపాటు కొన్నినూతనగ్రంథమాలలుగూడా బయలుదేరినవని వినుటకెంతయు ఉత్సాహపడుచున్నాను—తెలుగుదేశంలో పుస్తకాలు అచ్చువేయించడం, అమ్మడం సామాన్యప్రయత్నంకాదు ఎంతో మొండితనంవుండవలె. అదియొంతవరకు పోగుతుందో కారణం ఆంధ్రులలో పుస్తకంగాని, పత్రికగానిచదువుటచాలా అలవాటుకాలేదు. చదువువారున్న తామచదువవలసినవా కొనటంమాత్రం కష్టం, ప యువారుకొనినపుస్తకాన్ని తీసుకొని చదవటంఅలవాటుఅయిపోయింది దానివలననేపుస్తకాలుకాని పత్రికలుగాని కొనేవారుతక్కువపడికే వారినిబట్టిమాత్రే, అందువలనఒకగ్రంథమాల పెట్టడంఅంటే పుస్తకాలుప్రచురించడంఅంటే చాలాకష్టమే. అయినా అన్నికష్టాలకుఎదురై కూడా హైదరాబాదు సంస్థానములో మూడుగ్రంథమాలలు ప్రస్తుతంపనిచేస్తున్నవంటే ప్రశంసించక తీరదు.

నేను మొన్నవిడుదలఅయిన రోజులలో ఆయా గ్రంథమాలలవారికి అభివందనలేఖలు వ్రాయవలెనని, నాపుస్తకములుకూడా పంపవలెనని అనుకొను కానివారిచిరునామాలులభింపలేదు. నేనుకూడాఒకప్పుడు 'భారతీగ్రంథమండలి' అనే గ్రంథమాలను సాగించినవాడనగుటచేతను, పుస్తకలునడిపి దెబ్బలుతిన్నవాడనగుటచేతను కలుగుచాలాబొప్పులుకట్టివున్నవి. అందువల్ల ఇతరులవార్థికవ్యాపారిక కష్టాలుపూర్తిగా కొంతలోకొంతఅనుభవించివున్నందున అర్థంచేసికోగలను. పైగాకష్టపడినవారుప్రాతికజాబుచూచి ఉపశమనమైనాకూడా పొంది ముందడుగువేయడానికిఎంతో సహాయపడుతుంది. అయితే దానికి తనకష్టమును అప్పుచేసుకోగలిగినవా డొకడున్నాడంటే ఎంతో ఆనందంకలుగుతుంది అంపచేరవారిచిరునామాలు తెలియనందున తెలిసినను జెయిలులోవున్నందున ఉత్తరములువ్రాయగలిగిన అవకాశాలులేనందున తమకేవ్రాయవలసివచ్చినది, నాఅభివాదాలు ఆగ్రంథమాలాధిపతులకందజేయ ప్రార్థన.

## డక్కాలో పోలీసువారిపై దెబ్బలు !

బెంగాలురాష్ట్రంలో డక్కాలో అల్లరులు రెండుకోజులు కొంతించినట్లు కనిపించకపోగా, ఇంకను అల్లరుల వార్తలు వచ్చుచునేయున్నవి—డక్కా—నగరంలోని పశువైద్యశాల సమీపంలో ఏప్రిలు ౭వ తేదిన ఇద్దరువ్యక్తులు ఒకరు హత్యచేయబడిరి— వరాయిగంజులో మరొకనికి ప్రాణాపాయకరమైనంత దెబ్బకొట్టబడెను—

డక్కా—జిల్లాలో నారాయణగంజు సబ్డివిజనులో రాయపూరా, నేర్సింగ్ ఠాణాలలోని గ్రామాలలో కొందరు పోలీసులపార్టీని ౫వ తేదిరాత్రి ఒకఅల్లరిమూక కొట్టినట్లు—అందువల్ల ముగ్గురు కానిస్టేబిళ్ళకు దెబ్బలుతగిలినవి— ఆప్రాంతంలో ఇంతవరకు ౩౦మంది అరెస్టుచేయబడిరి—

---

లు ఆయాగ్రంథావళి అధిపతుల కందజేయ ప్రార్థన—

### డిఫెన్సు రాజకీయ ఖైదీలస్థితి

మనమద్రాసురాజధానిలో ౧౬౮ మంది డిఫెన్సుచేయబడిన రాజకీయఖైదీలు ప్రస్తుతం యిక్కడనున్నాము. అయితేఇందులో ౩౭ మంది ఒకబ్లాకులోను, మిగతవారొకబ్లాకులోనుత్తున్నాము, ఒకరినొకరిని కలియవీలులేదు. కఠిన ఖైదీలకేకాకుండా డిఫెన్సులకుకూడా ఈనెల (౧౫-౩-౪౧) తరగతులువచ్చినవి. కఠినఖైదీలు ఏ-బి-సి తరగతులంటే ఆమాటేఅంటే బాగుండదనికాబోలు ౧ వ, ౨ వ తరగతులని పేరుపెట్టినారు. ఏతరగతివారు వారానికి రెండుత్తరాలు వ్రాయవచ్చు. రెండువార్ల ఎవరితోనన్నా (interview)మాట్లాడవచ్చు, నెలకు రు ౧౦ లు స్వంతఖర్చుచేసుకోవచ్చు. ౨ వతరగతివారువారానికి ఒకఉత్తరం కలుసుకోవటానికి మాట్లాడవలెను ఇంకా రు ౫ లు ఖర్చు చేసుకోవచ్చును కొనుక్కొనే పుస్తకాలుకూడా యీమొత్తంలోనే చేరుతవంటారు. ఇండిపెండెంట్ ఖైదీలవలెను ఇవ్వాళనేవచ్చిందిగనుక మార్పులుఏమేమిగలుగుతవో చెప్పలేకుండావున్నాను. ప్రభుత్వమునకు పూర్తివ్యతిరేకమైనవి, నిషేధమైనవికాకపోతే పుస్తకాలుమాత్రం ఎన్నిఅయినా యింతవరకు యిస్తున్నారు పత్రికలుకూడాయిస్తున్నారు, ఆరోగ్యవిషయం దిక్కు—మొక్కు—వుండడంలేదు, నామటుకుజబ్బుచేసి వైద్యునివద్ద మందుతీసుకుంటూ గుంటూరులోవుంటే మళ్లీపట్టుకవచ్చారు. ఇంతవరకు అలవాటు లవలేదు, వస్తూనే చూస్తామన్నారు వైద్యాధికారులు అంటే మీకుమ నాకును పరిచయమున్నదని వ్రాయడంలేదు, నామాదిరి బాధపడుచున్న మిత్రులు పలువురుకలరు ప్రవాసంలోని ఉత్తరంవ్రాస్తున్నానకనుక సమాచారాలు తెలుపుటనావిధియని వ్రాయుచున్నాను.

ఆగ్రంథమాలలచిరునామాలు నాకు తెలియకుండుగనుక తమకువ్రాశాను హైదరాబాదులోని రాజకీయసాంఘిక ఆర్థిక అభివృద్ధినిగాని పరిస్థితులనుగాని తెలియజేసేపుస్తకాలు ఏమైనావుంటే పంపప్రార్థించుచున్నాను ఆగ్రంథమాలాధిపతులతో చెప్పినాగాని, కలుసుకొనిగాని జోగిపాడుగ్రంథమాల, ఆంధ్రకేసరిగ్రంథమాల, ఆణాగ్రంథమాల వారిపుస్తకాలు హైదరాబాదుకు పంపుటకేర్పాటుచేయప్రార్థన, తమరువ్రాసినపుస్తకాలు నమ్మకశ్యాస్య ప్రకటించినవికాకుండా ఏమున్నావుంటే అవియును పంపప్రార్థన నమ్మకశ్యాస్య వారిపుస్తకాలు మొన్ననే కొన్ని పంపినారు, అందులో తమకువ్రాసినవికూడా వుండవచ్చును. ఇంకాఅవిచేరలేదు. అందువలన నమ్మకశ్యాస్య పుస్తకాలలోవుంటే కలదన్న కారణంఅది. తమ పత్రికతప్పకపంపప్రార్థనతమరు నా'సంస్థానాలు' "ఆంధ్రరాష్ట్రం"కావాలెనంటే త్రిస్తినపల్లికి గాని, లేక ఆంధ్రదేశగ్రంథాలయసంఘంవారికిగాని వ్రాసినపంపుమరసిఆపిస్తాను, ఆంధ్రరాష్ట్రంలోని వమునకం ఆంధ్రమహాసభవారుప్రకటించారు. ఆంధ్రరాష్ట్రకాంగ్రెసు సంఘంవారినద్దఉంచారు, సంస్థానాలుకొన్ని కాపీలు ఆంధ్రదేశగ్రంథాలయసంఘ కార్యదర్శిచేతికిచ్చాను, వారికివ్రాసితెప్పించుకొనగోరుచున్నాను.

తమకుశ్రమకలిగించినందుకుక్షమించి ఆయా దుగ్రంథమాలలవారికి కలుసుకొనేయోజ్యాబువ్రాసియోఆమూడు గ్రంథమాలలవారి పుస్తకాలుహైదరాబాదు చేరుకునేటట్లు చూడప్రార్థన కాచూపు (' కటూహా పంపుచుంటారని తలిస్తాను.

ప్రవాసంలోవున్నాము గావున ఎప్పుడైనా విశేషాలువుంటే దయచేసిఒకజాబువ్రాయగోరెదను. కల్పనశాస్త్రాలు స్వీకరించవానికిక్కడ అంతఅవకాశంలో సగమేవచ్చేటట్లువ్రాయడానికి వుంటున్నది కావున తమరుఅప్పుడప్పుడు జాబుల్వ్రాస్తే ఆనందిస్తాను, ఆంధ్రోద్యమ అభ్యుదయం నైజాంలోఎట్లాగున్నదో తెలుసుకోగోరెదను ''

## హైదరాబాదు బజారు ధరలు

తేది ౫-౪-౫౦ ఫ

పల్లా ౧కి ౧౨౦ సేర్లతూకము

ధరలన్నీ హాలీకే.

| బియ్యము | పల్లా ౧కి ధర రూ | అ | పై |
|---|---|---|---|
| కిచిడీసాంబర్లు | ౨౬ | ౦ | ౦ |
| సంబర్లు | ౨౪ | ౮ | ౦ |
| ఢిల్లీభోగాలు | ౨౩ | ౦ | ౦ |
| రాంభోగర్లు | ౧౯ | ౮ | ౦ |
| నాసగ్రాం | ౧౮ | ౪ | ౦ కొత్తవి |
|  | ౨౧ | ౮ | ౦ పాతవి |
| అర్కాటి | ౧౮ | ౦ | ౦ (కొత్తవి |
|  | ౨౨ | ౦ | ౦ పాతవి |
| కోసాయటి | ౧౬నుండి ౧౬ కొత్తవి |  |  |
| బుడుములు | ౧౫ | ౦ | ౦ |
| కేశారి | ౧౬ నుండి ౧౭వరకు |  |  |
| గోధుమాలు షర్బతి | ౧౬ | ౮ | ౦ |
| బన్సీ | ౧౬ | ౦ | ౦ |
| అమ్మ—కి | ౧౬ | ౮ | ౦ |
| పోటియా | ౧౫ | ౦ | ౦ |
| ఎర్రగోధుమలు | ౧౪ | ౮ | ౦ |
| జొన్నలు | ౯ | ౦ | ౦ |
| తెల్లజొన్నలు | ౯ | ౮ | ౦ |
| పచ్చజొన్నలు | ౭ | ౮ | ౦ |
| మడిక ట్టుజొన్నలు | ౭ | ౧౨ | ౦ |
| సెనగలు | ౧౩ | ౨ | ౦ |
| కందులు | ౮ | ౪ | ౦ |
| మినుములు | ౧౧ | ౬ | ౦ |
| అలచలు | ౧౨ | ౮ | ౦ |
| సజ్జలు | ౭ | ౪ | ౦ |
| కుసుములు | ౭ | ౧౪ | ౦ |
| పప్పు |  |  |  |
| సెనగపప్పు | ౧౫ | ౮ | ౦ |
| కంది ,, | ౧౪౦ |  | ౦ |
| సిరిసెనగ ,, | ౨౦ | ౦ | ౦ |
| అలచ ,, | ౧౧ | ౪ | ౦ |
| మినప ,, | ౧౮ | ౦ | ౦ |
| పెసర ,, | ౧౮ | ౮ | ౦ |
| బెల్లము | ౯ | ౮ | ౦ |
| ఉప్పు | ౧౨ | ౧౩ | ౦ |
| ఉల్లిగడ్డ | ౬ నుండి ౪ ౧౨ ౦ వరకు |  |  |
| తెల్లనరుగు | ౧౨ నుండి ౨౦ వరకు |  |  |
| చక్కెర రమణము (౪౦ సే) |  |  |  |
| జావా ,, ,, | ౧౪ | ౦ | ౦ |
| బొంబాయి ,, ,, | ౧౩ | ౧౪ | ౦ |
| మద్రాసు ,, ,, | ౧౩ | ౧౫ | ౧ |
| నిజామాబాదు,, ,, | ౧౩ | ౧౨ | ౦ |
| మిశ్రిచక్కెర ,, పల్లా | ౧౩, | ౧౨ | ౮ ౦ |
| షర్బతచక్కెర,,(౪౦ సే) | ౧౬ | ౧౨ | ౦ |
| ఎల్లిగడ్డ ,౧౨సే | ౧ | ౮ | ౦ |
| అల్లం ,, ,, | ౧ | ౧౨ | ౦ |
| మణుము ౧౨ సే |  |  |  |
| కొబ్బరినూనె | ౪ | ౮ | ౦ |
| కుసుమనూనె ,, | ౩ | ౫ | ౬ |
| నువ్వులనూనె ,, | ౩ | ౧౨ | ౬ |
| వేరుసెనగనూనె ,, | ౨ | ౮ | ౦ |
| పున్నాగనూనె ,, |  |  |  |
| కిరోసిన్ (గ్యాస్),, డబ్బా ౧కి |  |  |  |
| నెయ్యి మణుము ౪౦ సే |  |  |  |
| బీదరునెయ్యి ,, ,, | ౪౨ | ౦ | ౦ |
| తెలంగాణా ,, ,, | ౩౯ | ౦ | ౦ |
| వనస్పతి డబ్బా ౧కి౧౧ | ౨ | ౦ |  |
| బంగారు తు ౧కి | ౫౧ | ౮ | ౦ |
| వెండి ౧౦౦ తు | ౭౧ ౧౨ ౯, | ౭౧ ౧౩ ౦ |  |
| తు ౧కి | ౦ | ౧౧ | ౬ |
| పవరుక ౧కి కల్గాను మా | ౨౯ | ౮ | ౦ |
| మాఠకం |  |  |  |
| హాలీకి కల్దారు | ౧౫ | ౧౫ | ౬ |
| కల్దారుకు హాలీలు | ౧౫ | ౧౩ | ౬ |
| అముదాలు బస్తా | ౧౧ | ౪ | ౦ |
| వేరుసెనగ | ౮ | ౪ | ౦ |
| బుడ్లలు పల్లా౧కి | ౮ | ౪ | ౦ |
| పప్పు పల్లా౧కి | ౭౨ | ౨ | ౦ |

గమనిక: —

ధరలు వీలైనంతవరకు సరియైనవిగా తెలుపుచుందుము. అయినను ఏమైన పొరపాట్లుండిన దానికి పత్రికవారు బాధ్యులుకాజాలరు.

---

## నియామకము

హైదరాబాదు (దక్కను), ఏప్రిలు ౯ మిర్జాఅహమదు ఫారూఖ్ బేగ్ గారు బాదె హామహుతు అతియాత్ మదద్గారుగా నియమింపబడినారు.

# విమానాల దాడులనుండి రక్షణ

కలకత్తానగరంలో ఏర్పాటులు

కలకత్తానగరంపైకి విమానాలువచ్చి అక్కడనుండే యంత్రశాలలపై బాంబులను వేయుచో ఆదాడులనుండి యంత్రశాలలలోని పనివారలను రక్షించుటకై ఆశాలలయజమానులు తమతమయంత్రశాలల ఆవరణలలో గోతులు త్రవ్వి, పనివారలను ఆగోతులలోనికి పంపించేఏర్పాటు చేయవలెనని ప్రభుత్వమువారు అన్నియంత్రశాలల యజమానులకును తెలియబరచినారు.

# వేలూరు జెయిలులో ౧౦౦ ఖైదీల నిరాహారదీక్ష

మదరాసు రాష్ట్రంలోని వేలూరు సెంట్రలు జెయిలులో సుమారు౧౦౦మంది డిటెన్యూ ఖైదీలు మార్చి౨౨వ తేది ఉదయంనుండి నిరాహారదీక్ష బూనియున్నారు. ఈఖైదీలలో కొన్ని తరగతుల విభాగము చేసినతరువాత పోయిన మూడునెలల నుండి వారలస్థితి చాలా చెడిపోయినదని వారనుచున్నారు— ఈస్థితిని అధికారులతో అంగీకరించునట్లు చేయుటకే వారలు నిరాహారదీక్ష బూనివారట

# టూరింగు సినిమా వద్ద అల్లరి

పోలీసు అమీనాగారి పరిష్కారము

(ఒకవిలేఖరి). వరంగల్లు, ఏప్రిలు౨:

వరంగల్లుసమీపమునగల కరీమాబాదుచెరువు దగ్గర రక్తసిక్తములయినబట్టలు, కాలిబూట్లు పడియున్నవి. హత్యచేయబడిన మనిషియెవరో తెలియలేదు. ఈవూరిలో దొంగతనాలు యెక్కువగా జరుగుచున్నవి. ప్రజలు భయకంపితులైయున్నారు.

దక్కన్ టూరింగుసినిమా మాలతీమాధవం, ఉగాదిపండుగకు వేస్తామని పండుగముందు మూడురోజులనుండి ప్రకటనచేస్తున్నారు, ప్రోగ్రాం ౯ం ఉ-౩౦లకని వ్రాసినారు. ప్రేక్షకులు కొలంతయునిండిపోయినారు, కాని సకాలమునకు ఆటఆరంభముకాలేదు. సకాలముపోయి అర్ధగంట లేటైపోయింది ౧౦౹౹ అయింది, ఆటకావడములేదు ప్రేక్షకులగోల ఆరంభమయినది మేనేజరుఅవచ్చిన రూ౧౫౦—౨౦౦లో వచ్చే అకౌంటు ఆస్తాచంక బెట్టుకుని ఎక్కడికోమాయమైపోయినాడు. ప్రేక్షకులలోమరింతగోల యెక్కువయినది. శాంతిగలవారెవరైనావచ్చి, “మీరు గోలచేయవద్దు మీమీపైకము వాపసుయిస్తాము, లేదా రేపటికి చెల్లేలాగు యీటికెట్టుమీద వ్రాసియిస్తా” మని చెప్పినపుణ్యాన పోయెవారు లేదు! మనదుర్బుద్ధికి దాయని ప్రేక్షకులలో నుద్రేకముపుట్టి కొందరుకొడీలు బల్లలుపగులగొట్టినారు కుర్చీలు విరుగగొట్టినారు, పరదాలుచింపివేసినారు, ఎలక్ట్రిక్కు బల్బులన్నియు పగులగొట్టినారు, అపుడు పోలీసుజవానులు వచ్చారు. మరునాడు సినిమావాండ్లు పోలీసుఅమీన్ సాహెబుగారితో చెప్పుకున్నారు. శ్రీవారువాళ్లనుపట్టి తెప్పించి కుర్చీలువగైరా తీసుకొనిపోయిన వాళ్ల వద్దనుంచి కుర్చీలు తెప్పించియు, కొందరను దండించియు, కొందలకు రూ౫లు, ౧౦లు, జరిమానాలువిధించియు కావలసినతంతంతయు నడిపినారు.

ఈయూరిలో రెండుపర్మనెంటుసినిమాహాలులు కట్టుచున్నారు ఒక్కొక్కదానికి యాభైవేలరూపాయిలు కావచ్చును ఒకటి సిద్దంశెట్టి లింగయ్యగారుకట్టించి, చిదిరాజ శేఖరగారికి కంట్రాక్టుయిచ్చినారు. రెండవది శేట్ల కాంతారావు, భిక్కాజీ దాదాబాయి గార్లు కట్టిస్తున్నారు. సిద్దంశెట్టివారి దానికప్పుడే ‘భూకైలాస్’ బుక్కుచేసినారు ఒక నెలలోపున కావచ్చును. ఈ టాకీపేరు “ప్రభాకరటాకీ”

ఇటలీలో మత్సువోకాగారి సంభాషణలు

జపానువిదేశాంగ మంత్రియగుమత్సువోకాగారు మార్చి౩౧వతేది ఇటలీప్రధాననగరమగురోంకు చేరిరి. వారుఏప్రిల్ ౧వతేదీ సాయంకాలము ఇటలీ విదేశాంగమంత్రియగు కౌంట్ సియానో గారితో ముస్సోలినీగారితోను భాషించిరి. ఆ తేదిన టికనస్టేటులో పోపు(ప్రపంచమంతటను రోమన్ కాథలిక్కులగురువు) గారిదర్శించి సంభాషించిరి. జర్మనీలోహిట్లరు, రిబ్బన్ట్రాప్ గార్లతో మత్సువోకాగారు సంభాషించునపుడు రిబ్బన్ ట్రాపుగారు వెంటవేయుచరంగంలో దిగుటమంచిదని చాలదూరము ఒత్తిచెప్పినను ఇప్పుడుచెప్పకొను చున్నారు. ఏప్రిల్ ౨వతేదిన మత్సువోకాగారు ముసోలినీగారితో మరల సంభాషించిరట,

మత్సువోకా గారు ఏప్రిల్ ౪వతేదివరోంనగరం నుండి తిరిగిబెర్లినుకుపోయిహిట్లరు గారితో రిబ్బన్ ట్రాపు గారిసమక్షంలో సంభాషించిరి,

****************

# గ్రంధస్వీకారము

****************

# హిందూ ధర్మశాస్త్రము స్త్రీలస్థానము

తగుపాటి మార్పులవసరము

మైసూర్ కతో, ఉస్మానియా యూనివర్సిటీ లాకాలేజీలెక్చరు హైదరాబాదు సివిల్ సర్వీసు లెక్చరరుగానున్నూ పనిచేయుచున్న సుప్రసిద్ధ న్యాయవాదులగు శ్రీవల్లూరి సూర్యనారాయణపంతులుగారు, ఎం. యల్. గారిచే ప్రకటింపబడిన గ్రంథము.

ఇందుయుగయుగాంతములనుండి మనధర్మశాస్త్రమునకెట్టిమార్పులు కొనితేబడుచున్నవియు వేదములు, శ్రుతులు, స్మృతులకుమనధర్మశాస్త్రమునకెట్టిసంబంధమున్నదియు చక్కని నిదర్శనములతో చూపబడియున్నది అదినుండియు వ్యవహారకాండ కాలపరిస్థితులనుబట్టి మార్పుకలిగించుకొనుటకవకాశములివ్వబడియేయున్నవనియు, మన ధర్మశాస్త్రముద్వాపరయుగమున కనుకూలించునదైన, పరాశరుడు కలియుగమునకనుకూలముగ ధర్మములనిరూపించినాడనియును ఇదేరీతి స్త్రీధనము, హక్కులు మొదలగువాటియందు, ఇంకను మార్పులవసరములనియు చక్కగ చూపియున్నారు.

వీరిఆంగ్లభాషారచన అనర్గళధారాయుక్తముయిరసవత్తరముగ ప్రతివ్యక్తిని సులువుగ బోధపడునటులరచించియున్నారు.

శ్రీపంతులుగారు ఈగ్రంధమును, తెలుగు, ఉర్దూనందుగూడ నిటులనేప్రకటించుచుచో దేశీయులకింకను, ఉపయోగకారిగనుండగలదు.

వి. వి. రమణయ్య.

# శ్రీ మృత్యుంజయఫార్మసీ, బెజవాడ

వృషసంవత్సర గంటలపంచాంగం

ఈ పంచాంగము బ్రహ్మశ్రీ గొట్టిముక్కల సుందరరామశాస్త్రి సిద్ధాంతిగారిచే గుణింపబడి శ్రీమృత్యుంజయఫార్మసీ [బెజవాడ] వారిచేప్రకటించబడినది ఈఫార్మసీలో అన్నివిధములఆయుర్వేదౌషధములు తయారుచేయబడుచుండును. ఈ ఫార్మసీస్థాపించి ౧౪వ ఏడుజరుగుచున్నది. పంచాంగప్రారంభమున పాశ్చాత్య, ప్రాచ్యపద్ధతుల ప్రకారము సంవత్సరఫలితములు తెలుపబడినవి. కొన్ని లగ్న యోగములు ఇంగ్లీషు తారీఖులతోసహా తెలుపబడినవి తిథి వార, నక్షత్రము లు, వర్జ్యము లు తెలుపబడినవి. గ్రహముల చారములు తెలుపబడినవి

# తెలుగుతల్లి

ఇది ౧౯౪౧ మార్చినెలనుండి త్రివర్ణచిత్రముగల ముఖపత్రముతో, క్రొత్తఅందచందములతో, సచిత్రముగా సికింద్రాబాదు నుండి వెలువడుచున్నది— మార్చి ఏప్రిలు నెలలసంచికలలో చిన్నకథలు, గీతాలు, సినిమావిషయాలు, స్త్రీసమస్యలచర్చ, బాలవినోదములు గలవు. ప్రతిసంచికలోను అనేకులు అనివిర్భరచిబహుమానాలిస్తున్నారు, మార్చినెలవి మొత్తం ౬ రూపాయిలు బహుమానాలు ముగ్గురికి విభజించబడినవి. దీనిసాలుచందా ఒకరూపాయి విడిసంచికవెల ౧౩ అణా.





# పాకిస్థానానికి బ్రిటిషు ప్రభుత్వామోదము లేదు

## సింధు గవర్నరుగారు చెప్పుట

కరాచీ, మార్చి ౩౧

అధికారపదవిని వదలిపోవుచున్న సింధుగవర్నరు సర్ లాన్సలెట్ గ్రాహంగారు నేటిదినము ఒక కరాచీదినపత్రిక ప్రతినిధితో సంభాషించుచు పాకిస్థానువాదమును బ్రిటిషుప్రభుత్వం ఆమోదించినట్లు కొంతమంది భారత రాజకీయ వర్గములవారలు అభిప్రాయపడుచున్నారు కాని ఈఅభిప్రాయం సరియైనదికాదు అనిరి.

సర్ లాన్సలెట్ గ్రాహంగారు పాకిస్థానవిధానమునట్ల ప్రతికూలభావముప్రకటించిరి. సర్ అబ్దుల్లాహరూన్ వంటివారి ధోరణులు హిందువులు అట్లు ఉండగా, అట్టివ్యక్తులు పాకిస్థానమునుగురించి ఎందుకలాలోచించుచున్నారో తెలియ లేదనిరి, హిందూముస్లింసఖ్యము కుదురుటయే తమఉద్దేశ్యమనియు తాముఉద్యోగములో ఉన్నకాలంలో ఇందుకుతక్కువ్వంచనలు లేకుండ పాటుబడితిమనియు సింధుగవర్నరుగారు తెలిపిరి.

సింధురాష్ట్రములో హిందువులు కాంగ్రెసు్వ హిందువులుఅని రెండుపార్టీలుగా చీలిపోవున్నారనిరి. కానిహిందువులందరు ఒక సంయుక్తహిందూపక్షంగాఏర్పడి అసెంబ్లీలో ప్రతిపక్షస్థానాలు ఆక్రమించుకొని ఉండవలెనని గవర్నరుగారు చెప్పిరి.

సింధుఅసెంబ్లీలోని కాంగ్రెసుపక్షసభ్యులు, మంత్రివర్గమును స్థిరంగాఏర్పరుచుటలో ప్రాధాన్యమువహించుచున్నారు. కాబట్టివీరు సత్యాగ్రహోద్యమములో పాల్గొనుట బాగులేదని సింధు గవర్నరుగారనిరి.

నేటిసాయంకాలమునకు సర్ లాన్సలెట్ గ్రాహంవారిసతీమణి క్వెట్టాకు వెళ్ళినారు. ప్రధానమంత్రి ఖాన్ బహదూర్ అల్లాబక్షు యితరప్రభుత్వోద్యోగులూ స్టేషనువద్ద గవర్నరుదంపతులకు వీడ్కోలు జరిపిరి.

సర్ హ్యూడోగారు క్రొత్తగా సింధురాష్ట్రానికి గవర్నరుఅగుదురు.

## బందరులో మదరాసు గవర్నరుగారి అడ్వైజరు

బందరురేవును నిజాంవారికిచ్చు విషయమై మౌనము

మదరాసు గవర్నరుగారి అడ్వైజరుఅగు హెచ్. యం. హుడ్ గారు మార్చి ౨౭వ తేది ఉదయం బందరుకుపోయి బందరురేవుతనిఖీచేసిరి. సాయంకాలము రేవుఆఫీసరుగారి బంగళాకువెళ్లి, అక్కడరావుసాహెబు పెదసింగు వెంకటరంగయ్యగారు అల్పాహారవిందుచేసిరి. ఈసందర్భములో పెదసింగు వెంకటనారాయణగారు పోర్టుపరిస్థితులనుగురించిచెప్పుచు, బందరురేవుని మ. ఘ. వ. నిజాంప్రభుత్వమునకు ఇత్తురని మరింతతీవ్రంగావ్యాపించియున్నదని ౨.కరిపోర్టుద్వారా తెలియజేసిరి. అవదంతివిషయమై హుడ్గారు ఏమియుసమాధానమీయక మౌనముదాల్చిరి.

[ఆంధ్ర ప.లో]

## నాంకింగు ప్రభుత్వస్థాపన వార్షికోత్సవము

జపానుపత్రికలఅభిప్రాయములు

టోకియో, మార్చి 30

నేడుచైనాలో జపానుఆదరణముతోఏర్పడిన నాంకింగుప్రభుత్వస్థాపన ప్రథమవార్షిక దివసము నేడు ఈదయంఈసంగతికిజపానీయపత్రికలుకొంత ప్రాముఖ్యమిచ్చినవి. కాని, పాలకవర్గముఏమరొక్కచున్న చక్కలనుఅవికప్పి పెట్టుటలేదు.

నూతనరాజ్యాంగము క్రమాభివృద్ధిపొందుచున్నను, ప్రభుత్వముతగినంత బలిష్ఠమైనదని గాని, దేశంయొక్కనిర్మాణవ్యవస్థితి త్వరగాబాగుపడుచున్నదని గాని అర్థంచేసుకొనగూడదు" అనిఒక పత్రిక వ్రాసినది.

ఆహారవస్తువులుతక్కువగనుండుట, సామగ్రిధరహెచ్చుగానుండుట—ఈరెండు వాంగ్ చింగ్ వీవీ వాని నాంకింగ్ పాలకవర్గముఎదుర్కొనవలసినజరూరు సమస్యలని తెల్పుచు,ఆహారపదార్థములలోటును తగ్గించుటకు జపానుసహకారముతో సాధ్యమైనదంతాచేసి పరిస్థితినినాంకింగుచక్కబెట్టవలెనవిఒకపత్రిక వ్రాసినది.

## యుద్ధానంతర ప్రపంచము

భయము, దారిద్ర్యము ఉండవు

మేజర్ అట్లీగారి ఉపన్యాసం

లండను, మార్చి30

బ్రిటనుయుద్ధములోగెలిచి, శాంతిఏర్పడిననాడు ఎట్లుండునోయనిచెప్పుచు నూతనప్రపంచమున యుద్ధలేకుండచేయబడునియు, దారిద్ర్యమనే అవమానకరమైనమచ్చ తొలగింపబడుననియు గ్లాస్గోలో ఉపన్యసించునప్పుడు మేజరు సి. ఆర్. అట్లీగారుపలికిరి. నీనుయుద్ధమంత్రివర్గములో ఒకమంత్రియుద్ధమువల్లగాని, లేమివల్లగాని కలిగిన భయమునుండి ప్రజలనువిముక్తిచేయుటకు మనము ప్రయత్నించవలసియుండును. అనిఅట్లీగారనిరి.

## తహసీల్దార్లనిర్ణయము

హైదరాబాదు [దక్కన్], ఏప్రిలు ౨

ఈక్రిందివారిని హైదరాబాదు ప్రభుత్వమువారు తహసీల్దారుఉద్యోగానికై సెలెక్టుచేసుకొన్నారు. రామచంద్ర నారాయణ ఇస్తన్నాగర్కే, బ్రజంగప్రసాదు, మహమ్మదు మహిబూబుగ్రహిమాను, మహమ్మద్ ఉమర్, నాష్టక్కి సీతారాంబడ్కేకర్, మీర్ ఖాదిరలీ, మీర్ ఖాజిమలీ, కేశవరెడ్డి, ఫరీదుమిర్జా. మహమ్మదుమహవీజ్, జహాంగీర్ మెహ్తా, బాల్కిషన్ గంగాఖేడ్కర్.

## మహారాష్ట్ర మహాసభ

హైదరాబాదు[దక్కన్,] ఏప్రిలు౨

మైమహాసభకు అనుమతిని ప్రభుత్వమువారు ప్రసాదించినారు. ఉమ్రావ్లో మహాసభజరుగును—కాశీనాథరావువైద్యాగారు అధ్యక్షత వహించుచున్నారు.

ఉగాదిపండుగ

పంచాంగశ్రవణము:—మహబూబునగరము

ఈనగరమునకు ౪ మైళ్లదూరములో ఒకగ్రామము వెనిరకలదు. ఇచ్చట కొంతవరకు హిందుముస్లింసఖ్యత అగుపడ్డది. ఇక్కడ ఉగాదినాడు శ్రీ పి. జానకిరామశర్మగారు హనుమదాలయములో పంచాంగమువినిపించిరి. ఇచ్చటికి ఆంధ్ర రుక్రైతులు మహమ్మదీయులు, హరిజనులుసైతము చాలమంది సమావేశమైయుండిరి సంవత్సర ఫలితములు గ్రహచారవిషయములు శర్మగారు చాలాచక్కగా తెలియపరిచిరి.

స్థానిక ఈడ్గి హనుమయ్య గూడ తనఇంటిలో పంచాంగము చెప్పుచు, ఎందరో శూద్రులు ఆ పంచాంగము వినుటకు వెళ్లియుండిరి. ప్రతివాని పేరుపై ఎన్నిపూజలవున్నవితెలిపిచెప్పుచు గ్రహచారములుచెప్పినాడు. శూద్రులు ఇతని ప్రశంస చాలాచేసిరి,

పురాతన హనుమదాలయమునుమంచిగాకట్టించుటకై వెదిరెరైతులు, కొటకురూకి,౧ంతూముల ధాన్యముఇచ్చుచున్నారు. దీని నిర్మాణమునుగూర్చి ప్రతివ్యక్తిపాటుపడుచున్నారు ఇచ్చటి పురాతనశివాలయము శ్రీ నరసింగరాయడు కట్టించదలచినట్లు తెలిసినది.

ఏనుగుకొండగ్రామము మహబూబునగరమునకు ౩మైళ్లదూరములోగలదు. తిరుమలయ్య అను ఒకచీరదాసుని ఇంటిలో అమవాస్యనాటి రాత్రి దొంగతనముజరిగినది. రు౧౦౦లవిలువగల సొత్తులు దొంగిలింపబడినవి ఈవార్త పోలీసువారికి తెలిపి పంచనామచేసి వస్తుపరిశీలనచేయుచున్నారు. యజమానినివిచారింప దేవునికి తెలియునవను. పోలీసువారు అతనినేబాధించుచున్నారు. ఆనాటిరాత్రి చాలావరకు ప్రతిరోజువచ్చి భజనచేయువారువచ్చి భజనచేసినారట వారువెళ్లిపోనతర్వాత ఈసంఘటనజరిగినది.

ఇంతవఱకు బయలుపడలేదు

వేముల ౩౦-౬-౫౦౯-

ఇంతకుపూర్వము వేములగ్రామపు బాలరాము ఇంటిలో దొంగతనముజరిగినవార్త అందరికితెలిసినదే? ఈవూరుగ్రామాశ్రయుని అనుమానముతో బట్టియుండిరి.పోలీసువారు, అతనిని అతనిసఖుని గూడవదలినట్లు తెలిసినది. కానిఇంతవరకుదొంగ ఎవరో బయలుపడలేదు.

గీతాబోధ- ఉపన్యాసము

సికింద్రాబాదు మారేడుపల్లిలో శ్రీ సుబ్రహ్మణ్యస్వామి వారి సన్నిధిలో వృష నామ సం౹౹ చైత్రశుద్ధపాడ్యమి శుక్రవారం మొదలు అనగా (౧౧-౪-౪౧) మొదలుకొని చైత్రబహుళసప్తమి గురువారం (౧౭-౪-౪౧) తేదీవరకు తిరుపతి సమీపమునయున్న శ్రీవ్యాసాశ్రమ స్థాపకులగు శ్రీ మళయాళస్వాములవారిచే ఉదయం౮గంటలనుండి ౧౦గంటలవరకు శ్రీమద్ భగవద్గీతను గురించి బోధయున్న. సాయంకాలం౬నుండి ౭ గంటలవరకు భక్తిజ్ఞానమును గురించి ఉపన్యాసము జరుపబడును.

